తే॥ గీ॥ శతకములు లోకకల్యాణ సాధనంబు
లందునియ్యది రామున కంకితంబు
పైగ నీనాటిపలుకులచే పలికినాఁడ
పండితులుమీరు దయను జేపట్టరయ్య!!



కర్త:

# యేటుకూరు సీతార

---

# శ్రీ
# రామచంద్ర శతకము.



శ్రీ

# రామచంద్రశతకము.

యేటుకూరు సీతారామయ్యచే రచియించి ప్రకటించినది.

మొదటి కూర్పు: ౧౦౦౦ ప్రతులు.

వాణీ ముద్రాక్షరశాల, బెజవాడ.



[వెల. రు. ౦—౪—౦

# పీఠిక.

రసవిదులారా!

ఆంధ్రవాఙ్మయమున శతకము లగ్రస్థానము వహించియున్నవి. కథాపాశవేల్లితములు, వర్ణనానిబిడీకృతములగు ప్రబంధములకంటె శతకములె ప్రశంసాపాత్రములు. దేశ మధర్మపరివేష్టితమైనపుడు కవుల మనోజ్ఞవాక్కులనుండి శాపరూపముగ సవిచారసూచకముగ ననేకశతకములు వెలువడినవి. అట్టివానిలో వెంకటాచలవిహారశతకము, సింహాద్రినారసింహశతకము, వేణుగోపాలశతకము, ఆంధ్రనాయకశతకము లోనగునవి చేరియున్నవి. ఇట్లె సంస్కృతవాఙ్మయమునఁగూడ మహిమశతకము లోనగునవి కలవు. దేశానుకాలానుసారముగఁ గవుల యుద్రేకములు మాఱుచుండును. ఆయాకాలధర్మములఁ దెలుపుటకీశతకములఁ జరిత్రగ్రంథములనక తప్పదు.

ప్రకృతము దేశము సందిగ్ధస్థితిలోనున్నది. వాఙ్మయము నూతనవికాసమునొందుచున్నది. దేశీయులు త్యాగశీలురై కార్యరంగము నలంకరించుచున్నారు. ధర్మాధర్మసంఘట్టనము, ప్రాచీననవీనాచారసంఘర్షణము జరుగుచున్న యీవర్తమానకాలమున వివిధాంశముల సేకరించి నూతనభావములతో నీశతకమువ్రాసి గ్రంథకర్త మనకృతజ్ఞతకుఁ బాత్రుడగుచున్నాడు. మృదుశైలితో నూతనభావములతో, దేశకాలపాత్రానుగుణ విషయములతోనున్న యీశతకము దేశీయులమన్ననగాంచునని మా విశ్వాసము. ఈశతకము ప్రాచీనశతకప్రతిబింబముకాదు. ఇందు స్వతంత్రములగుభావములు, మనోజ్ఞములగు నంశములు గలవు. భారతవర్షము నూఁపివైచుచున్న నిమ్నజాత్యుద్ధరణము, బ్రాహ్మణేతరోద్యమము, స్త్రీస్వాతంత్ర్యములోనగు నంశములిందు సర్వజనసమ్మతములుగ సమర్థింపబడియున్నవి. లోకానుభవమునుగూర్చిన పద్యములలోఁ గొన్నిచోటుల నమూల్యభావములుగలవు. భక్తివిషయమున, భగవత్సృష్టిపరిశీలనమున వ్రాయబడిన పద్యములు హృద్యములుగనున్నవి. తఱచిచూచినఁ బెక్కుసుగుణములిందుగలవు. ఇట్టిసద్గ్రంథరచనమునకుఁ గ్రంథకర్తను పాఠకులు ప్రోత్సహించుటధర్మము.

ఇట్లు,

భాషాసేవకులు,

శేషాద్రి రమణకవులు,

శతావధానులు.

నందిగామ,
10–11–22

# విజ్ఞప్తి

"చ॥.................................నే
గతిరచియించిరేని సమకాలము వారలు మెచ్చరే కదా"

ఆర్యులారా!

ప్రస్తుతము హిందూదేశమునంతముఁ గలఁతబెట్టుచున్న సాంఘిక రాజకీయ విషయములతో నీశతకము వ్రాసితిని. ఇందలి గుణాగుణంబులు విమర్శింప బాఠకులుఁ గర్తలు. ఈశతకమునుఁ బరిష్కరించి సదభిప్రాయముతో పీఠిక నొసంగిన బ్రహ్మశ్రీ, శ్రీమాన్ శతావధానులు దూపాటి వెంకటరమణాచార్యులవారికి భక్తిపూర్వక నమస్కారము లొనర్చుచున్నాను. మఱియు నీపుస్తకమునకగు నచ్చుకర్చంతయు నొసంగి త్వరలో నా పుస్తకముఁ బ్రకటింపఁజేసి నటువంటి నామిత్రులును నైజాం రైల్వేస్టేషను మాష్టరుగారునునగు మహారాజ రాజశ్రీ బొబ్బారి పట్టాభిరామయ్యనాయుఁడుగారికి కృతజ్ఞతాపూర్వక నమస్కారము లర్పించుచున్నాను.

ఇట్లు,
విధేయుఁడు,
గ్రంథకర్త,
యేటుకూరు సీతారామయ్య

యేటుకూరు,
19–11–22



# శ్రీ

# రామచంద్రశతకము.

---



రామచంద్రనిన్ ♦ శౌరికీర్తనఁజేసి
మునులెల్ల భవపాశ ♦ ముక్తులైరి
సీతాపతీ నిన్ను ♦ సేవించి భక్తులు
కైవల్యమునఁ బ్రాత ♦ కాపులైరి
దాశరథీనీవె ♦ దైవమంచనినమ్మి
మనుజులెల్లను లోక ♦ మాన్యులైరి
కాకుత్స్థ వంశ నీ ♦ కార్యముల్ వినుతించి
కపులీప్సి తంబులఁ ♦ గాంచఁ గనిరి
తే॥ గీ॥ వారు వీరననేల యో ♦ పరమ పురుష
నిన్ను సేవించు చుండెడు ♦ నిఖిల మనుజు
లిహ పరంబులఁ బొందని ♦ దెద్దిగలదు?
రమ్యగుణ సాంద్ర శ్రీరఘు ♦ రామచంద్ర!! ౧

సీ॥ ఐదేండ్లు నిండని ♦ యర్భకుఁ డారీతి
దైత్యనాథు నెదిర్చి ♦ ధైర్యముగను
అల్పురాలగునట్టి ♦ యాటవి కాంగన
విద్వాంసు లెఱుగని ♦ విధమెఱింగె
బావురు గానికి ♦ భయపడు నొకపక్షి
బ్రహ్మరాక్షసు నాఁగె ♦ భండనమున
వన భూములందుండు ♦ చెనటిజంతిదిక్రోఁతి
యవలీల నసురుల ♦ నణఁచివైచె
తే॥ గీ॥ సర్వభూతాధి పతివి నీ ♦ సాయముండ
నెంతకార్యముఁ జేయలే ♦ రెవ్వరైనఁ
గొండయే యున్నగోడల ♦ కొదువయేమి?
రమ్యగుణసాంద్ర శ్రీరఘు♦రామచంద్ర!! ౨

సీ॥ కవులచేతననేక ♦ కావ్యముల్ రచియింపఁ
జేసివిఖ్యాతి నా ♦ర్జించినావు
రాజులచేనెన్నొ ♦ రాజ్యముల్ స్థాపింపఁ
జేసిగౌరవమెంతొ ♦ చెందినావు
ఋషులచేఁబరతత్త్వ ♦ ఋజుమార్గమునుబోధ
పడఁజేసి పూజ్యతఁ ♦ బడసినావు
పౌరులచేతసౌ ♦ భ్రాతృత్వమునుబోధ
పరచిపండితకీర్తి ♦ బడసినావు
తే॥ గీ॥ అట్టినిన్నెంచి లోకసా ♦ మ్యంపురత్న
హారమొకదాని నీమెడ ♦ నమరవైతు
నించుకేని యనుగ్రహ ♦ ముంచుమయ్య!! 3

## —* దేశస్థితి *—

సీ॥ అలహరిశ్చంద్రుండు ♦ నలభూపతియు ధర్మ
రాజుపాలించిన ♦ రాజ్యలక్ష్మి
కణ్వ, దగస్త్యుండు, ♦ గౌతముండు వసిష్ఠ
మౌని శిక్షించిన ♦ మాతృభూమి
కామధేనువులను ♦ గల్పవృక్షములను
జింతామణినిగన్న ♦ జీవగడ్డ
హిమవంతమేగాక ♦ హేమాద్రియును మఱి
రజతాద్రిగలిగిన ♦ రత్నగర్భ
తే॥ గీ॥ అరులు జేరంగజాలని ♦ భరతమాత
పరులబ్రేమించుచుండెను ♦ పరమసాధ్వి
పడెడుపాట్లేమి నేటికీ ♦ భరతభూమి॥ ౨

సీ॥ పరతత్వమెఱిగిన ♦ బ్రాహ్మణవంశమే
పరవిద్యచే నేడు ♦ బ్రతుకవలసె
జగమంతగెల్చిన ♦ క్షత్రియవంశమే
పరుల పాదముబట్టి ♦ బ్రతుకవలసె
వాణిజ్యకుశలులౌ ♦ వర్తక ముఖ్యులే
పరధాన్యమునుదిని ♦ బ్రతుకవలసె
సర్వవృత్తులెఱుంగు ♦ సకలజాతులవారుఁ
బట్టపొట్టకు లేక ♦ బ్రతుకవలసె
తే॥ గీ॥ పరులఁజేర్చి కాపాడిన ♦ భారతీయు
వార పరదేశములకేగ ♦ నందునుండి
పారదోలుచునున్నారు ♦ పశువులనుచు॥ ౩

సీ॥ భువి "ఆత్మవత్సర్వ ♦ భూతాని" యనువారు
మనుజులే తాకరు ♦ మాలయనుచు
సర్వజ్ఞులై యహిం ♦ సాధర్మమెఱిగిన
యార్యులే మాంసంబు ♦ నారగింత్రు
వేదమంత్రములను ♦ విరచించి మించిన
స్త్రీలకే విద్యలు ♦ చెల్లవండ్రు
అతివల పెండ్లిండ్ల ♦ నైచ్ఛికంబని వ్రాసి
వారె జేతురు పెండ్లి ♦ బాలికలకు.

తే॥ గీ॥ బ్రాహ్మణులె తప్ప వేదముల్ ♦ పరులెవరును
జదువరాదట వినరాదట ♦ సంస్కరణము
పాపమేమి జేసినదయ్యొ ♦ భరతభూమి?

సీ॥ జాతీయవిద్యలు ♦ చదువువారలు లేరు
దానికై డబ్బిచ్చు ♦ దాత లేడు
అందు నేర్చినవారి ♦ కాదరింపులు లేవు
బ్రతుకఁగాఁదగినంత ♦ వసతి లేదు
దేశీయులకు లోక ♦ దివ్యదృష్టియె లేదు
పల్లెలం గానవిద్య ♦ పట్టలేదు
పత్రికాపఠనంబు ♦ ప్రతియూరునకు లేదు
చదివిన వినునట్టి ♦ జనులు లేరు

తే॥ గీ॥ కలవుసుమి జాతులందున ♦ కలతలెన్నొ !
బహుళమగు భాగ్యములతోడఁ ♦ బ్రతికినట్టి
భరతఖండము నేఁడిట్టి ♦ పాటుగనియె! ౭

సీ॥ ఆంగ్లేయవిద్యల ♦ నాదరింతురుగాని
తప్పుచుండుటలోన ♦ తనువు దీరు
నగ్గినచోనిల్వ ♦ నీడగల్గునుగాని
యాశ్రయింపులలోన ♦ యంత్యమగును
ఉద్యోగ మొకడబ్బ ♦ నుండజిక్కునుగాని
భారమాపనిలోన ♦ బ్రతుకుదీరు
ఎప్పుడో యేనాడో ♦ తప్పకటామెనా
యంతయువ్యర్థమై ♦ యావలించు.
తే॥ గీ॥ నన్నియునుదాటి యధికార ♦ మబ్బెనేని
తనకులంబును దనపేరు ♦ దానమఱచు
భరతఖండపు విద్యార్థి ♦ పాటులివ్వి. ౭

సీ॥ తాఁకినచో మైల ♦ దాపుఁజేరిన మైల
తనవంటకముఁజూడ ♦ తగని మైల
నూలు పోగున మైల ♦ నులకత్రాడున మైల
పసివాండ్రు తాకిన ♦ బట్ట మైల
కంచుపాత్రకు మైల ♦ కనకంబునకు మైల
రాతి చిప్పకు మైల ♦ తాబు మైల
పేరుజెప్పిన మైల ♦ పిల్చినచో మైల
నిప్పును మఱినూతి ♦ నీరు మైల
తే॥ గీ॥ చినుకుపడ్డట్లు గానున్నఁ ♦ జెడ్డమైల
ఋషులు జెప్పిన ధర్మంపు ♦ రీతి యిదియొ?
భరతఖండం బికెన్నఁడు ♦ బాగుపడునొ? ౮

సీ॥ కల్లమాటల డబ్బు ♦ గడన జేయఁగవచ్చు
చెడుకార్యము లవెన్ని ♦ చేయవచ్చు,
బరులు జూడక యుండ ♦ సుర ద్రాగఁగా వచ్చుఁ
నారగింపగ వచ్చు ♦ నామిషంబుఁ
దలలు మార్చఁగ వచ్చు ♦ తాకట్టు లిడవచ్చు
వరుసయే లేకుండ ♦ దిరుగవచ్చు
దనను నమ్మినవారి ♦ తలలు దీయగ వచ్చు
దల్లినే బయటకుఁ ♦ దరుమవచ్చు
తే॥ గీ॥ పండితుఁడె గాఁడు నీ కెంతొ ♦ భక్తుఁడైన
మానవుడు తాఁకె యిచ్చిన ♦ మంచినీరు
ద్రాఁగి నంతన కులమెటో ♦ తరలునంట !! ౧౦

—* నిమ్న జాతులు *—

సీ॥ మాఁల మాదిగ లంచు ♦ మనుజులఁ దాఁకరు
పంది కంటెను వీరు - పతితులొకొ్క?
దూరంబు పొమ్మంచుఁ ♦ దోలికొట్టుచునుంద్రు
కుక్క కంటెను నీచ ♦ కులమువారె?
నోటి తోడుత పేరు ♦ నడుమ జంకుచునుంద్రు
బండ బూతులకన్న ♦ పాపమొక్కొ?
ప్రియము తోడుత నింత ♦ పిలచి పెట్టఁగబోరు
పిల్లి కంటె నసహ్య ♦ మల్లదేమొ?
తే॥ గీ॥ కాకినేగాక ఛీ! ఛి! ఛీ! ♦ క్రక్కినట్టి
పాపమును దిను పాపిష్టి ♦ బండవాని
దరికి జేర్తురు వీరల - దరికిఁబోరు!! ౧౧

సీ॥ వ్యవసాయ వస్తువుల్ ♦ సవరించి కాపులఁ
గలకాలమును వీరు ♦ కాచుచుంద్రు
పాదరక్షలు గుట్టి ♦ బల్ పసందుగ తోళ్ళ
నూని వృత్తులనిల్ప ♦ బూనుచుంద్రు
వస్త్రముల్ నేసి స ♦ మస్త జాతుల వారి
ప్రాణరక్షణ పట్టుఁ ♦ బట్టు చుంద్రు
మనమెంత నీచపు ♦ మాటఁ జెప్పినగాని
చేయరానిది కూడ ♦ జేయు చుంద్రు

తే॥ గీ॥ కోయ, యెఱుకల, యేనాది ♦ కొండదొంగ
జాతి కన్నను దక్కువ ♦ జాతి వారె?
చెరువు నీటి కైనను వీరి ♦ జేరనీరు!!. ౧౨

సీ॥ కాయకష్టముఁ జేసి ♦ కాయంబు పోషించు
జనులు వీరెటు నిమ్న ♦ జాతి వారు?
పరులు దూషించిన ♦ బరుల దూషింపని
జనులు వీరెటు నిమ్న ♦ జాతివారు?
మనమెల్ల పీడిన ♦ మనల పీడగలేని
జనులు వీరెటు నిమ్న ♦ జాతివారు?
విష్ణు సేవాసక్త ♦ వైష్ణవోత్తములైన
జనులు వీరెటునిమ్న ♦ జాతి వారు?

తే॥ గీ॥ వీరి యభివృద్ధి మానమున ♦ గోరనట్టి
ప్రాచ్య మార్గానువర్తులే ♦ పతితులైన
నిమ్న జాతులు గదసుమీ ♦ నిశ్చయముగ॥

సీ॥ ద్రవ్యవంతున కెల్ల ♦ తక్కువవడ్డియే
పేదవారల కెగా - పెద్దవడ్డి
అన్నాతురున కెవ్వ ♦ రడిగిన పెట్టరు
కలవారి విందులే ♦ ఘనములెందు
పిచ్చమానికె కూలి♦ పేదవారల కెల్ల
బెట్టు గల్గినగదా ♦ పెద్దకూలి
నిజము బల్కినపేద ♦ నేరమే యగుగదా
కలవారి మోసముల్ ♦ కానబడవు.
తే॥ గీ॥ బీదవారల సర్వంబు ♦ బీల్చియిట్లు
భాగ్యవంతులు దయమాలి ♦ బ్రతుకుచుండ
శాంతమది పంచములయందు ♦ జచ్చిపోదె? ౧౪

—* బ్రాహ్మణేతరులు *—

సీ॥ వేదకర్మలనెల్ల ♦ వీడియుండుటచేత
శూద్రులంచని శ్రుతి ♦ శ్రుతమె గలదు
బ్రాహ్మణకర్మగమే ♦ బ్రహ్మత్వమిదునంచు
పలువిధంబుల శ్రుతుల్ ♦ పలుకుచుండె
క్షత్రియుల్ ముద్గల, ♦ కౌశిక, కణ్వులు
కర్మచేత నిగోత్ర ♦ కర్తలైరి
కర్మజ్ఞానార్థమై ♦ కావింపవలెనంచు
శౌరిగీతవచించు ♦ స్పష్టముగను
తే॥ గీ॥ జ్ఞానినీచకులంబులో ♦ గలుగుగాదె!
కర్మగావింప నధికారి ♦ గాడెవాడు?
శూద్రులకుఁ గర్మ లేదంట ♦ శ్రోత్రియంబె? ౧౫

సీ॥ దేవాలయములలో ♦ తీర్థమీయంగఁగా
దక్షుతల్ పూజింప ♦ నడుగరాదు
ప్రార్థనమంత్రముల్ ♦ పఠియింపగారాదు
తనచేయివరులకుఁ ♦ దగులరాదు
ధర్మకర్తయెయైనఁ ♦ దలఁబ్రాలిడఁగరాదు
చేరిసూత్రముల స్పృ ♦ శింపరాదు
తనసేవయైనను ♦ తాముందుబోరాదు
కొబ్బరిముందుఁజే ♦ కొనఁగరాదు

తే॥ గీ॥ బ్రాహ్మణులు బ్రాహ్మణేతర ♦ ప్రభువునైనఁ
బరువునీరీతి జేయ నీ ♦ భారతమున
బుట్టకుండునె ద్వేషంబు ♦ పూర్ణముగను!! ౧౬

సీ॥ బ్రాహ్మణేతరుఁడేమి ♦ పంచముండైనను
నర్చకత్వము జేయ ♦ నబ్బినపుడు
బ్రాహ్మణులేయేమి ♦ పతితజాతులు గూడ
మాంసంబుదినుటలు ♦ మానినపుడు
పురుషులహెచ్చేమి ♦ స్త్రీవుబోండ్లునుఁగూడ
పూర్ణాధికారముల్ ♦ పొందినపుడు
ధనము లుబ్ధులకేమి ♦ దాతలందునఁగూడ
నిల్చు నుపాయముల్ ♦ సేర్చినపుడు

తే॥ గీ॥ భరతఖండము స్వేచ్ఛలో ♦ బడునుసుమ్ము
వేదములఁబోధ జేసెడి ♦ విధులెయివ్వి
"యట్లుకేయగుగాక"! ని ♦ యనుమి యీశ! ౧౭

సీ॥ మాలమాదిగెలన్న ♦ మండిపడెదువాఁడు
కాశికేగినయంత ♦ గలదెఫలము
పడతులకునుస్వేచ్ఛ ♦ పనికిరాదనువాఁడు
గుడికట్టినంతఁ జే ♦ కూను నెముక్తి
వేదముల్ శూద్రులు ♦ వినగూడదనువాఁడు
బావిద్రవ్వింప జేఁ ♦ పడు నెసుఖము
విధవల పెండ్లిండ్ల ♦ వెక్కిరించెదువాడు
సత్రంబుగట్టింప ♦ జను నెదివికి
తే॥ గీ॥ మానవులస్వేచ్ఛ గోరెదు ♦ మనసులేక
యెంతయిను ప్రార్థనముసేయ ♦ నేమి ఫలము
దేశసేవనీ సేవని ♦ దెలియవలయు ౧౪

## — స్త్రీ స్వా తం త్ర్య ము. —

సీ॥ చదువగూడదు శ్రుతుల్ ♦ చదువుజెప్పగరాదు
భామలతోనైనఁ ♦ బలుకరాదు
ఎండవానలకైన ♦ నెంతమాత్రంబైన
గొడుగు, చెప్పులుగూడఁ ♦ గోరరాదు
తప్పుగారున్నను ♦ ధర్మమార్గమెయైన
బతిచెంతనుండియుఁ ♦ బలుకరాదు
దేశసేవకునైన ♦ దీర్ఘయాత్రలకైన
సరసనదోష్ఠిమై ♦ జనగరాదు.
తే॥ గీ॥ దేవతార్చనకే స్త్రీకిఁ ♦ దావులేదు
అగునునరునకు మగువ య ♦ ర్ధాంగియనుచు
జెప్పుటకు వీరికేలాగు ♦ సిగ్గులేదొ? ౧౫

సీ॥ పురుషులవలెనెయా ♦ పుడమినుద్యోగముల్
జేయింప వలయును ♦ స్త్రీలచేత
బురుషులవలెనెయా ♦ పుడమిషోడశకర్మ
కధికారమిడవలె ♦ నతివలకును
బురుషులవలెనెయా ♦ పుడమి పెండిలిభార
మంతయూవలెసుమీ ♦ కాంతలకును
బురుషులవలెనెసూ ♦ పూర్వార్జితపుటాస్తి
బంచియీవలెసుమీ ♦ భామలకును

తే॥ గీ॥ నంతియేగాక యువతుల ♦ నదిమిపట్టి
భరతలక్ష్మిని బ్రాక్షింప ♦ పట్టుమనుచు
నీసుతేకెట్లు స్వాతంత్ర్య ♦ మిచ్చునయ్య ౨౦

సీ॥ పురుషులతోఁబాటు ♦ పూవుబోండ్లును గూడ
శాసన సభలకు ♦ జనినయపుడు
మగవారితోఁబాటు ♦ మగువలెల్లరు గూడ
వాదింప "కోర్టుకు" ♦ వచ్చినపుడు
బాలురతోఁబాటు ♦ బాలికలును గూడ
వివిధ విద్యలు నేర్వ ♦ వెళ్లినపుడు
కాంతులతోఁబాటు ♦ కాంతలెల్లరుఁగూడ
సభలలోఁజర్చలు ♦ సలిపినపుడు

తే॥ గీ॥ హైందవుల జన్మసాఫల్య ♦ మందెననుమి!
యార్య మతమది పడిపోక ♦ యాగెననుమి!
యట్టికాలపు వారలే ♦ యార్యులనుమి ౨౧

—* లుబ్ధత్వము *—

సీ॥ తలిదండ్రు లెంతటి ♦ ద్రవ్యంబునిచ్చిన
సంపాదనము తాను ♦ సలుపుచున్న
నెలకు నూర్లను దెచ్చు ♦ నేర్పరుల్ సుతులున్న
వారసత్వపు టాస్తి ♦ వచ్చుచున్న
నెన్నొ సేరిభూము ♦ లెన్నొ మాన్యములున్న
దాకట్టు పత్రముల్ ♦ తఱుగకున్న
గుదువ పెట్టిన నగల్ ♦ కొని పెట్టె నింపిన
ధాన్యంబు గాదెలఁ ♦ దరుగకున్న
తే॥ గీ॥ లుబ్ధుడెప్పుడు "నేడ్చు"న ♦ లో" యటంచు
గుక్కఁబోలె గావలిఁగాంచు ♦ కొనుటెగాని
కానియును దానిలోఁ డీయ ♦ గలఁడె వాఁడు? ౨౨

సీ॥ కొనపిల్ల కనుపింప ♦ గోచిపెట్టుటెగాని
మొలనిండ గట్టఁడా ♦ మోటువాఁడు
కారంబుతో చల్ది ♦ గతుకు చుండుటెగాని
జిహ్వకు రుచియను ♦ చింత లేదు
వచ్చినడబ్బెల్ల ♦ వడ్డికిచ్చుటెగాని
తనయింటి సౌఖ్యంబుఁ ♦ దలఁపఁబోఁడు
పాతరగింజలు ♦ పాసిపోయినగాని
పిడికెడు ముష్టిని ♦ పెట్టఁబోఁడు,
తే॥ గీ॥ ఎంతయోఁ జేర్చు తినఁడిసు ♦ మంతలోభి
చీపు రూడ్చుటెగాకొక్క - చిన్నిగింజ
యైనఁదిన నేర్చునే యెన్నఁ ♦ డైనగాని. ౨౩

సీ॥ వడ్డీలకిడి పెంచి • వచ్చినధనముతో
నాస్తిసంపాదించి • యనుభవింతు
నని యాస్తి గనుపింప • నత్యాస జనియింప
హెచ్చుజేయఁగనాస్తి • యెంచుచుండు
నగ్రహారము,బోలె • నాస్తి యేర్పడినను
దనసౌఖ్య మనుమాటఁ • దలఁపఁబోవ
డీ చేనులోనుంటి • యింకొక్క చేనులో
నేపిట్టలోయని • యేడ్చుచుండు
తే॥ గీ॥ దానమును ధర్మమును లేక • తానుదినఁడు
ద్రవ్యవంతుఁడె కష్టముల్ • దప్పలేదు
బుద్ధియే డబ్బు గాదట • పూరుషునకు!! ౨౮

సీ॥ తనకు క్షేత్రములున్న • తరుగని ధనమున్న
వర్షాశనంబులు • వచ్చుచున్న
ఇంద్రహర్మ్యమువంటి • యిల్లు చేకురియున్నఁ
బాడిసౌఖ్యం బింటఁ • బ్రబలుచున్న
బుట్టిన వారెల్ల • గిట్టిపోవుచు నున్నఁ
బుట్టుదు రను నాస • పోవుచున్నఁ
దినువారు లేకున్నఁ • దినలేక తా నున్న
బరులయేడ్పులు చెవిన్ • బడుచునున్న
తే॥ గీ॥ బట్టుమని చేతితో నింత • పెట్టబోఁడు
పైగ నితరుల యాచించు • పాడువృత్తి
మానడది యేమొ యొక్కొక • మానవుండు॥ ౨౯

సీ॥ పాడిబఱ్ఱెను గొన ♦ బాలిచ్చునేగాని
పాడికిఁదనయింట ♦ బఱ్ఱ లేదు
పెంకుటియిల్లున్న ♦ పిల్చియొప్పిశుగాని
వానకు నిలువంగ ♦ వసతిలేదు
భూమి తాకట్టిడ ♦ బోయునూరులుగాని
యెకరముకన్నను ♦ హెచ్చులేదు
వడ్డియెక్కువయున్న ♦ వంద, వే, లిడుగాని
తనకంచుఁదాఁకఁడు ♦ దమ్మిడియును.
తే॥ గీ॥ ఎల్లకాలము ద్రవ్యమే ♦ యెంచు లోభ
యనుభవించఁడు సుఖమేమి ♦ యందువలన
పాలరుచి యేమెఱుఁగు గొల్ల ♦ వాని దుత్త॥ ౨౬

—* రాజధర్మము. *—

సీ॥ తాతల నుండియుఁ ♦ దప్పుపద్ధతియున్నఁ
గఠినచట్టముల బో ♦ గార్పవలయుఁ
గులభేద మదిలేక ♦ గుణమె ముఖ్యమటంచు
నెల్లర నొకటిగా ♦ నేలవలయుఁ
బరులపై యాధార ♦ పడక యెల్లను కష్ట
పడులాగు నేర్పంగఁ ♦ గడగవలయు
నందరి యందున్న ♦ యాత్మ యొక్కటి యను
భావమెల్లెడ బల ♦ పఱుపవలయుఁ
తే॥ గీ॥ బురుషుఁడును గాంతయును భేద ♦ బుద్ధిలేక
యెల్లరకుఁగూడ ♦ స్వాతంత్ర్య ♦ మీయవలయు
రాజధర్మంబు లివియండ్రు ♦ రామచంద్ర! ౨౭

సీ॥ వేదముల్ శాస్త్రములు ♦ వినఁగూడ దనువారి
శిక్షింపఁ జట్టముల్ ♦ చేయవలయు
నస్పృశ్యుఁడవటంచు ♦ నన్న నెవ్వరినైన
బంధింప వారంటు ♦ బంపవలయు
ప్రౌఢలు గానట్టి ♦ బాలికలకు పెండ్లి
జేయువారలశిక్ష ♦ సేయవలయు
బాలబాలికల ని ♦ ర్బంధ జాతీయమౌ
విద్యకై కోట్లిచ్చి ♦ వేయవలయు
తే॥ గీ॥ యదియె స్వారాజ్య మనదగు ♦ నంతెగాక
యెడమచెయి దీయగాఁజేసి ♦ యిదిగో యనుచు
పుఱచెయి పెట్టుటలుగాదు ♦ పుడమిఁయందు॥ ౨౭

—* లోకానుభవము *—

సీ॥ పురుషుఁడై భూమిలో ♦ పుట్టి నంతన యేమి
గుణవతి యగుభార్య ♦ గుదురవలయు
భార్యయుండుట గాదు ♦ పాండిత్యమును జ్ఞాన
వంతులౌ సంతతి ♦ వరల వలయు
సంతుగల్గిన యేమి ♦ సకల సౌభాగ్యముల్
గల్గి వారలుభూమిఁ ♦ గ్రాలవలయు
గ్రాలి నంతన యేమి ♦ కలకాలమునుఁ గూడ
నీపాదములభక్తి ♦ నిలుపవలయు
తే॥ గీ॥ నూటికెని కోటికిని గూడ ♦ నేటిఁవఱకు
నిట్టి సంసారములు భూమి ♦ నెన్నిగలవు?
కనుక నే జన్మమెత్తుట ♦ కష్ట మంద్రు॥ ౨౮

సీ॥ పౌరోహితముఁ జేసి ♦ బ్రతుకుట యొక్కటి
కరణమై గావించు ♦ గడన రెండు
తనను నమ్మిని వానిఁ ♦ దగఁగొల్చుటది మూఁడు
బంధువు లనుచు లోఁ ♦ బడుట నాల్గు
బడిఁబెట్టి ద్రవ్యంబుఁ బడయఁ ♦ జూచుట యైదు
పైరివేటు వృత్తిచే ♦ బ్రతుకు టారు
గురువునంచు ధనంబుఁ ♦ గూర్పఁజూచుట యేడు
వీథిపురాణముల్ ♦ వినుచు టెనిమి

తే॥ గీ॥ ఇట్టి వృత్తులచేఁబ్రాని ♦ యెన్మికంటెఁ
గాని వారల కడకేగి ♦ కడుపుఁజూపి
కాళులొత్తి జీవించుట ♦ ఘనముసుమ్ము!! ౩౦

సీ॥ పరులతోఁ గొండెముల్ ♦ పల్కుచుండుట రోఁత
పనిలేని సోమరి ♦ బ్రతుకు రోఁత
పదిమంది కహితుఁడై ♦ బ్రతుకుచుండుట రోఁత
భార్యతోఁ దను వేరుఁ ♦ బడుట రోఁత
ధనముండి సుఖముగాఁ ♦ దినలేమియే రోఁత
పగ లంతిపురి జేరు ♦ బ్రతుకు రోఁత
చదువని మూర్ఖపు ♦ జనుల పొత్తది రోఁత
మతి లేని మూఢుఁడౌ ♦ సుతుఁడు రోఁత

తే॥ గీ॥ ధర్మమైననుఁ బరులతోఁ ♦ దర్కమెపుడు
చేయుటది రోఁతఁ సాక్ష్యముఁ ♦ జెప్ప రోఁత
రోఁవెలందుల♦ గూడుట ♦ రోఁత! రోఁత!! ౩౧

సీ॥ పూర్వార్జితపుటాస్తి ♦ పోగొట్టుకొనువాఁడు
చేసినయత్నంబుఁ ♦ జెడెడువాఁడు
ఎంతయోవల్లించి ♦ సుంతనేర్వనివాఁడు
పదిమందిబిడ్డల ♦ బడుగువాఁడు
దేహమందెప్పుడు ♦ దీర్ఘరోగమువాఁడు
జీతంబుఁజాలని ♦ జీతగాఁడు
అప్పులబాధతో ♦ నెప్పుడేడ్చువాఁడు
స్త్రీధనంబునుఁ గర్చుఁ ♦ జేయువాఁడు

తే॥ గీ॥ బ్రతుక నేటికి భూమిపైఁ ♦ బరువుచేటు
ఇన్నివిషయంబులొకని పై ♦ నొక్కయెడల
గజ్జికుక్కకంటెనుగూడ ♦ కష్టజీవి!! 3౨

సీ॥ ప్రీతియించుక లేని ♦ పెట్టుకేగుటరోఁత
ధర్మంబుఁదెలియని ♦ తగవురోఁత
తనమాటవిననట్టి ♦ తగవుదీర్చుటరోఁత
గుణహీనుతోఁబొత్తుఁ ♦ గొనుటరోఁత
పెక్కుమందినిగూడి ♦ బేరమాడుటరోఁత
తనవారితప్పును ♦ దాఁచరోఁత
అప్పుపుట్టినటంచు ♦ నుప్పళించుటరోఁత
యడ్డాలుబోవుట ♦ చెడ్డరోఁత

తే॥ గీ॥ బందుగులజూచిగర్వంబుఁ ♦ బడుటరోఁత
యెదటివానితప్పులనెప్పు ♦ డెంచరోఁత
తన్నుదానె శ్లాఘించుట ♦ తగనిరోఁత!! 33

సీ॥ పసివాండ్రు తిండికై ♦ పరుగులెత్తుట హెచ్చు
పడతుక లనుమాన ♦ పడుట హెచ్చు
అప్పు పెట్టినవాండ్రు ♦ దెప్పిపొందుట హెచ్చు
కలవాండ్ర కెందును ♦ గాంక్ష హెచ్చు
సాగనిముసల్లు ♦ సణుగుచుండుట హెచ్చు
బడిపిల్లలకు కోంకె ♦ పనులు హెచ్చు
గుణములమూర్తి ♦ కోడండ్రకిము హెచ్చు
ఏనాడి పెండ్లికి ♦ యొండ హెచ్చు

తే॥ గీ॥ బాడవాండ్రకు తిప్పల ♦ బాధ హెచ్చు
బ్రాహ్మణులు చేయిజాచెడి ♦ బ్రతుకు హెచ్చు
పిచ్చుకలకెంపు భోగంపుఁ ♦ బ్రీతి హెచ్చు॥ ౩౮

సీ॥ కలవారలంచుఁదా ♦ గన్నవారల పోల్కె
జుట్టాలు జూచుట ♦ చూపుగాదు
ధనమంటచే నొంటి ♦ ఘనుఁడీతఁడని చెప్పి
హితమాడు హితులెల్ల ♦ హితులుగారు
ఐశ్వర్యమున్నప్పు ♦ డతి గౌరవంబుతో
భర్తనెంచెడు భార్య ♦ భార్యగాదు
ఆస్తియిచ్చినతండ్రి - నతిప్రేమతో మెప్పు
మతిజూచు సుతులెల్ల ♦ సుతులుగారు

తే॥ గీ॥ కాలవశమున సర్వంబు ♦ గోలుపడిన
సుగుణవంతుని బ్రేమతోఁ ♦ జూచువారె
చుట్టములు, మిత్రులును, భార్య ♦ సుతులు నిజము. ౩౯

సీ॥ వేడంగి లేదు తర్క • వేడ లేదన లేదు
వేడకుండఁగ రోజు • వెళ్లఁబోదు
అన్యాయ మొనరించి • యార్జింపఁగా లేదు
ధర్మంబుఁదలఁచిన • ధనము రాదు
పరులు తప్పానరింప • బయట పెట్టగబోఁదు
పరులచే బాధలు • పడక బోఁదు
దేశోపకారియై • సొంపు జేయక పోఁదు
కార్యసాఫల్యంబుఁ • గాంచఁబోఁదు
తే॥ గీ॥ • లేనివాఁడేమియును జేయ • లేఁడు నిజము
కలుగువానికి సద్బుద్ధి • కలుగఁబోఁదు
బుద్ధి, ద్రవ్యంబుఁగలవాఁడు • పుడమి నరుఁడు. ౩౬

సీ॥ కాంటెగాఁడైనను • కోపియేయైననుఁ
గూటసాక్ష్యముఁ బల్కు • కూళయైనఁ
బరమలుబ్ధుండైన - పాపాత్ముఁడైనను
గురువాంతకుఁడైన • క్రూరుఁడైన
విశ్వనాశకుఁడైన • విప్రహాంతకుఁడైన
జారుఁడైనను గొప్ప • చోరుఁడైన
మూర్ఖుఁడైనను వట్టి • మొద్దుమానిసియైన
సురద్రాగువాఁడైన • క్షుద్రుఁడైన
తే॥ గీ॥ కులములేనట్టి వాఁడైన • గ్రుడ్డియైన
నాల్గుడబ్బులుగలయట్టి • నరుని మాట
నమ్ముదురుగాని పరులను - నమ్మబోరు !! ౩౭

సీ॥ ఊరగృహస్థుల ♦ యుచ్ఛిష్టపత్రముల్
నాకిజీవించు యే ♦ నాదికన్న
హేయపదార్థంబు ♦ లెత్తిజీవించెడి
పాకి వారలక్రింది ♦ బ్రతుకుకన్న
ముకుపుల్లయున్నను ♦ మూత్రంబెయాసించు
పాపిష్టిజంతువు ♦ బ్రతుకుకన్న
పల్లవీజనములు ♦ పవళింప నిల్లిచ్చి
వాకిఁట కాపుండు ♦ వసతకన్న

తే॥ గీ॥ వ్యాజ్యములలోన ప్రైవేటు ♦ వానిబ్రతుకు
సర్వవిధములనీచంబు ♦ జనులలోన
వానికంటెదుర్మార్గుఁడు ♦ వసుధ లేఁడు. ౩౮

సీ॥ శాస్త్రముల్ చదివిన ♦ సరసుఁడువదరునా?
యాడంబరముఁ జూపు ♦ నల్పుడెపుడు
బలవంతుఁడెప్పుడు ♦ పరులపై కేగునా?
యొంటిప్రాణమువాడె ♦ మింటికెగురు
వీరపతివ్రత ♦ వీథిలోఁదిరుగునా?
వేశ్యయాడఁనుబుగ్గ ♦ వ్రేలుతోడ
మృగరాజుపరులకు ♦ మొగముజూపించునా?
గ్రామసింహంబెప్డు ♦ కఱువవచ్చు

తే॥ గీ॥ నన్నియుండిన విస్తరి ♦ యణగియుండు
నేమిలేనట్టి ఫుల్లాకి ♦ యెగిరిపడును
తబలమ్రోగునె తడచుగా ♦ దప్పెటవలె? ౩౯

సీ॥ పథ్యంబుఁ జేయుఁడు ♦ బరులవిందునకేగ
బ్రాతరోగంబెల్ల ♦ బైటపడును
చేతడబ్బదిలేక ♦ చకచకలాడింప
నున్నకొంచెముగూడ ♦ నూడిపోవు
తంత్రంబులనునమ్మి ♦ తగవులాటకుబోవ
తప్పుమీదికివచ్చి ♦ ముప్పుదెచ్చు
పరసతుల్ గనుపింప ♦ పల్కరించి హాసింప
బరులచేఁ దన్నులు ♦ పడుటనిజము

తే। గీ॥ ఎంతశివమెక్కినను దేహ ♦ మంతవంచి
తిరుగ బరువించుకేనియు ♦ దరుగబోదు
పెద్దలగువారు జెప్పెడు ♦ సుద్దులివియె.

సీ॥ దారిద్ర్యపిశిజేయు ♦ ఘోరపాపులకును
మానవులను జంపు ♦ మత్సరులకు
మరణశిక్షయొ? లేక ♦ మఱి వేరె వరకమో?
విధియించుచుండుట ♦ వెఱ్ఱితనము
పరువుమర్యాదతో ♦ బ్రతుకఁజూచెడు వాంఛ
సర్వంబు నీ వను ♦ సమతబుద్ధి
పల్లెటూరున యున్కి ♦ పామరస్నేహంబు
పూటకుఁగతిలేని ♦ పాటివృత్తి

తే॥ గీ॥ యార్జనముఁ జాలదంచను ♦ నాఁడువాండ్ర
పోరు, బిడ్డలు, గల్పించి ♦ పుట్టజేయు
మదియె శిక్షలకన్నింటి ♦ కంత్యశిక్ష॥ ౮౧

సీ॥ అగ్రజాతులవారి ♦ కాధిక్యమది హెచ్చు
నీచజాతులవారి ♦ నిల్గు హెచ్చు
మాలమాదిగలందు ♦ మనుభోతుతనమె చ్చు
పూలమ్మువారికిఁ ♦ బొగరు హెచ్చు
స్త్రీజనంబులకెందుఁ ♦ ఛీదరింపులు హెచ్చు
గణికజాతికి ద్రవ్య ♦ కాంక్ష హెచ్చు
విద్యావిహీనుల ♦ వేదాంతమది హెచ్చు
కూలివాండ్రకు ముచ్చు ♦ గుణము హెచ్చు
తే॥ గీ॥ పండితాళి వివాదముల్ ♦ పడుట హెచ్చు
కవులకే వేళ నాగ్రహ ♦ కలన హెచ్చు
పల్లెటూరువారికి మోటు ♦ బలము హెచ్చు॥ ౪౨

సీ॥ కంపెనీవారికి ♦ గ్రాపింగులవి మెండు
భూతవైద్యుల కెల్ల ♦ బొట్లు మెండు
పల్లెరైతులనోటఁ ♦ బండుబూతులు మెండు
భట్రాజమాటల ♦ బలము మెండు
కొలుపులో సారాయి ♦ కోలాహలము మెండు
చెడుసోది చేడెల ♦ చెవుడు మెండు
కులపెద్దకాపుల ♦ తలగుడ్డలవి మెండు
పెండ్లిప్రధానాల ♦ పిలుపు మెండు
తే॥ గీ॥ డబ్బురానట్టి ప్లీడరు ♦ డాబు మెండు
చేయలేనట్టి యధికారి ♦ చిట్టు మెండు
లంచములు మేయు నధికారి ♦ లావు మెండు॥ ౪3

సీ॥ వైనీడుసుద్దుల ♦ శాకశోకము హెచ్చు
శివమెత్తు వారికిఁ ♦ జేఁగు హెచ్చు
తిరునాళ్ల జారుల ♦ తిరుగులాటలు హెచ్చు
నడిరేయి యెలుకుల ♦ నడక హెచ్చు
బాజాలు నటకులఁ ♦ బైకిదూకుట హెచ్చు
కోడిపందెముచోట ♦ గుంపు హెచ్చు
వంతపాడెడువారి ♦ గొంతుపాటలు హెచ్చు
రాజవేషమువాని ♦ రంగు హెచ్చు

తే॥ గీ॥ బొమ్మలాటలలో నోటి ♦ బూతు హెచ్చు
తార్పగత్తెల మర్యాద ♦ తనకు హెచ్చు
త్రాగుబోతుల తగ్గింపు ♦ తినము హెచ్చు॥ ౪౪

సీ॥ చెడుకార్యములు వేలు ♦ జేయుచుండెడివాడు
చప్పినంతనె గొప్ప ♦ నరుఁడండ్రు
పగలును రాత్రియు ♦ బట్టలుతుకువాడు
భువిపెడ వ్యవహార ♦ పురుషుఁడండ్రు
పాదములకడ జేరి ♦ బ్రతుకుచుండెడివాడు
చావగా శ్రీరాము ♦ చంద్రుఁడండ్రు
పిల్లికిభిక్షంబుఁ ♦ బెట్టకుండినవాని
నీల్గగా కర్ణున ♦ కీడటండ్రు

తే॥ గీ॥ మూల్గుచును మాటలాడెడు ♦ ముసలివాఁడు
దొంగలకుగురువే యైన ♦ దొరటండ్రు
మాతి నెఱపిన ధర్మంపు ♦ మూర్తియండ్రు॥ ౪౫

సీ॥ భార్యను గాంచుచో • పండ్లుగీలెడువాడు
దాంపత్యమున గల్గు • తగవుదీర్చు
నన్నదమ్ములనోట • మన్నుగొట్టినవాడు
సోదర్లవైరముల్ • జొచ్చిదీర్చు
తల్లిదండ్రులకింత • గిల్లిపెట్టనివాడు
వారి వారల మనో • వర్తిదీర్చు
కొడుకులయుక్తిచే • వెడలగొట్టినవాఁడు
కోడండ్రసొమ్ముల • గోడుదీర్చు
తే॥ గీ॥ అప్పులెగవేసి సాక్ష్యము • తప్పుజెప్పు
నీచుఁడు వివాదములుదీర్చు • నేర్పుగాఁడు
పాడుకలికాలమందలి • పద్ధతి యిది॥ ౪౬

సీ॥ గురువన్న శిష్యుల • గొంపలబ్రతుకుటా?
చిద్రూపమును బోధ • సేయవలయు
అధికారియనగ బ్ర • వ్యార్జనఁజేయుటా?
ప్రజలకై తనమేను • బాయవలయు
బ్రాహ్మణుండనగను • బ్రైవేటుపనులకా?
మతధర్మబోధచే • మనగవలయు
ధనికుఁడంచనగను • దాకట్లుగొనుటకా?
దేశసేవకుఁడయి • తిరుగవలయు.
తే॥ గీ॥ చూడు సంస్కారిణంబన్న • జట్టుబొట్టు
మాటలా! లోకమందలి • మానవతుల
పూర్ణముగు స్వేచ్ఛకైఁతాను • బోరవలయు॥ ౪౭

సీ॥ పిల్లలు బ్రతుకని ♦ తల్లి కాన్పులుమెండు
పనికిమాలిన చెట్టు ♦ ఫలముమెండు
పడకలయూరెద్దు ♦ కడ అంకె లవిమెండు
గొడ్డుబోతావుల ♦ కుడితిమెండు
వండనేరనివా ♦ రలోంకబెట్టుట మెండు
కొసలేనివారల ♦ కోర్కెమెండు
నడువంజాలనివాఁడు ♦ నుడువు క్రోసులుమెండు
చదువెఱుంగనివారి ♦ చదువుమెండు

తే॥ గీ॥ ఆర్జనములేనివానికి ♦ నవ్వుమెండు
గొల్ల పెండ్లికి శివముల ♦ గోలమెండు
శూద్రతిండికి మజ్జిగ ♦ జుట్టుమెండు॥ ౪౮

సీ॥ కోమటికన్నుల ♦ కాలికి రేఖలుహెచ్చు
మంగలి తలగుడ్డ ♦ మడుపుహెచ్చు
బుడబుడక్కులవాని ♦ చెవుగుడ్డలవిహెచ్చు
కోయవాండ్రకు మందు ♦ గోలహెచ్చు
గంగిరెద్దులవాండ్ర ♦ రంగునామముహెచ్చు
బూబుల చెవులకు ♦ పోగుహెచ్చు
ఒరులకు వైదికుఁ ♦ డొదిగియుండుటహెచ్చు
నియ్యోగి మాటల ♦ నీల్గుహెచ్చు

తే॥ గీ॥ కమ్మవారికి వ్యవహార ♦ కక్ష హెచ్చు
తెలగవారికి పోట్లాట ♦ తిట్లుహెచ్చు
ధరణి రెడ్లకుమూర్ఖపు ♦ తనముహెచ్చు. ౪౯

సీ॥ సంగీతమున ముందు ♦ సకిలించుటది హెచ్చు
నాటకంబున ముందు ♦ పాట హెచ్చు
పెండ్లికిముందుగా ♦ ప్రేమ మెత్తులు హెచ్చు
కుస్తీకి ముందుగా ♦ గోండ్రు హెచ్చు
తలయంటుటకు ముందుఁ ♦ దల గోకుటది హెచ్చు
తిక్కసోదికి ముందు ♦ మ్రొక్కు హెచ్చు
ఉద్యోగమున ముందు ♦ నుబ్బితోఫ్రుట హెచ్చు
శోభనంబునముందు ♦ శోభ హెచ్చు

తే॥గీ॥ తరలు పెండ్లికి ముందుగా ♦ దంభ మెచ్చు
కానికార్యంబులకు ముందు ♦ కలహ మెచ్చు
చెడెడుపనులకు ముందర ♦ చేత హెచ్చు॥ ౫౦

సీ॥ తెలియనివారలు ♦ తలద్రిప్పుటలు లావు
పరుగెత్తు బ్రతుకు ♦ బండలావు
చెప్పనిపంతుళ్ళ ♦ చెడబాదుటలు లావు
క్రొత్తకోడలి గుస ♦ గుసలు లావు
తేలేని పెనిమిటి ♦ దీర్ఘాలుగనలావు
మాఱుతల్లుల నోటి ♦ మాటలావు
ఒల్లని పెండ్లాము ♦ కల్లయేడ్పులు లావు
పడుచువారలు కోప ♦ పడుటలావు

తే॥గీ॥ వినెడువారలు హా! యన ♦ వివిధగతుల
డోలువాయింపనేరని ♦ డోలుకాఁడు
గడ్డపడిపోవ తలయూపు ♦ గుణములావు॥ ౫౧

సీ॥ గాడ్దెకొబ్బరికాయ • కాలదన్నిన దైవ
భక్తికా కాయలు • పనికిరావె?
పన్నీరుగంధంబు • పందిమెచ్చని యంతఁ
బల్లవాధరులు చేఁ • బట్టరొక్కొ?
తాంబూలమును నక్క • తాఁకకుండిన యంతఁ
బడయుదా ఘనమిది • ప్రజలచేత?
కోఁడి రత్నము కాలి • గోటఁజిమ్మినయంతఁ
బ్రభువులు తలదాల్ప • పనికిరాదొ?
తే॥గీ॥ శాంతులను, దాంతులను, • శుంఠ చప్పరింప
వారి యోగ్యతబోవునే • వసుధయందుఁ
గుక్కచే నేన్గుమర్యాద • కొఱఁతపడునె?

సీ॥ పొరుగువారెప్పుడు • పోరాడుచుండినఁ
గాలమేరీతినో • గడుపవచ్చు
గ్రామమంతటికి దాఁ • గంటకుండైననుఁ
బ్రతుకవచ్చును సుమీ • బాధలేక
తలిదండ్రి, తమ్ములు • తన్నుదూఱుచునున్న
మర్యాదచెడకుండ • మనఁగవచ్చు
కొడుకులుకూతుండ్రుఁ • గొట్టవచ్చుచునున్న
గాదని వారల • గడుపవచ్చు
తే॥ గీ॥ చీదరించుచుఁదన్నందుఁ • జేరకుండ
భార్యయే నిందసల్పినఁ • బ్రతుకదరమె!
బ్రహ్మకైనను నాతని • బాబుకైన॥ ౫3

సీ॥ వ్యవహారబంధముల్ ♦ వందలువేలున్న
దారిద్ర్యమెప్పుడు ♦ తఱుగకున్న
దేహమందెంతటి ♦ దీర్ఘరోగంబున్న
బంధువైరంబెంత ♦ ప్రబలుచున్న
సంసారమెంతటి ♦ సంతుష్టిలేకున్న
పలువురుబిడ్డల ♦ బాధయైన
బంగారమది చేతఁ ♦ బట్ట మన్నగుచున్న
శనిబట్టి తన్నెంత ♦ జంపుచున్న
తే॥గీ॥ ముఖవికాసముతోడుత ♦ ముద్దులొల్క
బల్కరించిధైర్యముజెప్పు ♦ భార్యయున్న
స్వర్గసుఖములకన్నను ♦ సౌఖ్యమబ్బు॥ ౫౪

సీ॥ పండిన పండ్లన్ని ♦ పరులకిచ్చుటెగాని
తినునె చెట్లొకటైన ♦ తీపియంచు?
రత్నరాసులనెల్ల ♦ రాజులకిడుగాక
జలనిధిదాల్చునే ♦ తలనుగొన్ని?
మేఘంబుజలమెల్ల ♦ మేదినికిడుగాక
పదిలపర్చునెపంచి ♦ పాత్రెడైన?
కొండరాళ్లన్నియు ♦ గోడలకిడుగాక
కట్టునే తాఁ జిన్ని ♦ గడపయైన?
తే॥గీ॥ బరులయభివృద్ధికైపాటు ♦ పడెడువారు
తమకు నగులేమి, కష్టముల్ ♦ దలపఁబోరు
పైగగోరరుపరులచే ♦ బ్రతిఫలంబు॥ ౫౫

సీ॥ పగలెల్లయొడలో • పల గష్టపడుచున్న
పట్టెఁడుపొట్టకుఁ • బుట్టకున్న
జెయిజాచి యడిగినఁ • జీదరించుచునున్నఁ
జేతిలో పనులన్ని • జెడుచునున్న
నప్పులవాండ్రెంత • యదలించుచుండిన
వట్టినిందెలు పైకి • వచ్చుచున్నఁ
దన వారిలో నెంత • తలవంపు గనున్నఁ
దగడంచుఁదన్నెంత • దఱుముచున్న

తే॥ గీ॥ బరమ శాంతస్వరూపిణి • భార్యయున్నఁ
పొట్టచెక్కలుగానవ్వు • పుత్రుఁడున్న
కష్టమేలేదు వానికే • కాలమందు॥ ౫౬

అమితభాషణమును • నమిత భోజనమును
నమితహాస్యమును • నమితనిద్ర
నమితసంగమమును • నమితవాచకమును
నమిత దారిద్ర్యంబు • నమితదాన
మమితమా బిడ్డలు • నమితమాభాగ్యంబు
లమితాధికారంబు • నమితరోగ
మమిత మానాశయు • నమితప్రభావంబు
నమితవైరంబును • నమితచెలిమి

తే॥ గీ॥ నమితమైన యాకర్షణ • మమితశక్తి
యమితకాలంబునందునే • యంత్యమగును.
అంత్యమందున దుఃఖమే • యాజనకైన ౫౭

సీ॥ దొంగవానికి ముక్తి • త్రోవజెప్పుటకన్న
పిల్లికి నామాలు • బెట్టమేలు
త్రాగుబోతుకుఁ జేయు • ధర్మబోధలకన్న
క్రోతితోఁ దుతవాడు • కొనుటమేలు
ఆకుటాలికి జెప్పు • రామకీర్తనకన్న
ఎత్తిచేతులుపైకి • యేడ్వమేలు
మోటు వానికి దేశ • పాటు జెప్పుటకన్న
కుక్కనెత్తిని బేలు • గ్రుక్కమేలు
తే॥ గీ॥ దేశభక్తులు ధర్మముల్ • దెలుపునపుడు
పిసినిగొట్టును సభలకుఁ • బిల్చుకంటె
జంతువులజేరి భాషింపఁ • జాలమేలు॥ ౫౮

సీ॥ బిడ్డలుండుటగాదు • పెండ్లిజేయుటయుఁగా
దిల్లుకట్టినయందు • వల్లఁగాదు
పంటపండకగాదు • భార్యపోవుటఁగాదు
కష్టపడకగాదు • కఱవుగాదు
దండుగఁబడిగాదు • తగులబడుటఁగాదు
పాడిలేమినిగాదు • పరువుగాదు
ధనము పోవుటగాదు • ధర్మంబునుంగాదు
చదువువల్లనుగాదు • చావుగాదు
తే॥ గీ॥ హీనమైగాదు తెల్వియుం • దేల వెనుక
కాలమందుఁ జేసిన పాప • కర్మమునను
తగనిదారిద్ర్యమిప్పుడు దాపరించు॥ ౫౯

సీ॥ పూర్వంబునందింత • పుణ్యంబు జేసినా
పట్టిన కాయెల్ల • పండెయగును
వెనుకబాపేదల గనుచుండెనా ప్రీతి
నీవాండు ద్రవ్యంబు • హెచ్చుచుండు
పరులగాంచి యసూయ • పడకయుండిన వెన్కc
బదిమందికినిc బ్రీతి • పాత్రుcడగును
పరులబిడ్డలకింత • పరకూన్న మిడియెనా
బడయుబిడ్డల దోస • పండ్లలాగు

తే॥ గీ॥ ఏదియును లేక యుపుడేద్వ • నేమిఫలము
ఇప్పుడైనను సద్బుద్ధి • యింతయున్నc
బడయు సౌఖ్యము రాబోవు • భవమునైన॥ ౬౦

సీ॥ విద్యాంసునకునొక్క • విదుషీమణిని దెచ్చి
పెండ్లిజేయంగ దేమి • పెంకెతనము?
ద్రవ్యవంతులకెంత • దానగుణంబును
సుంతైనcగల్పింప • డెంతతప్పు?
పేదలకొందరి • బిడ్డలcగల్పించి
బాధించునదియేమి • పాపబుద్ధి?
దేశమోక్షమునకై • త్రిప్పలుcబడువార
కష్టపెట్టునదేమి • కపటగుణము?

తే॥ గీ॥ ఏమిలాభము బ్రహ్మకీ • హెచ్చుతగ్గు
కలయికలుభూమిలోపల • గలుగజేయ
ఘనుcడెయగుగాక యీరీతి • కాదతనికి॥ ౬౧

సీ॥ పదిపదేడులదాక • బ్రతికిననేమిలే
ప్రబలమహావ్యాధిలో • బాధపడుచుఁ
దనయింటఁదరుగని • ధనమున్ననేమిలే
తనపొట్టకేయింత • దినకయున్న
బదికూరలనుదాను • భక్షింపనేమిలే
యతిథివాకిటనంగ • లార్చుచుండ
దనమార్గమెందరు • తగునన్ననేమిలే
యన్యాయమేదాను • ననుసరింప
తే॥ గీ॥ దార్ఢ్యమును, తెంపు, బాత్రమా • దానగుణము
కలిగినీయందు సద్భక్తి • గలుగువాని
జీవనము జీవనము వేరె • జీవమేల? ౬౨

—* భ క్తి—ఈ శ్వ ర వి లా స ము. *—

సీ॥ అభశుభంబెరుగని • యజ్ఞానమునగొంత
బాల్యమందుండెను • భ్రమనుగొంత
సంసారమునకేమొ • సల్పువాంఛనుగొంత
విబుధులమాటలు • వినకకొంత
“నిన్ను సేవింపమి • నేరమా?” యనికొంత
యేమార్గమోయని • యెంచికొంత
సేవింపఁదలఁచియు • సిగ్గుచేతనుగొంత
యెప్పుడు లేమిచే నేడ్పుకొంత
తే॥ గీ॥ కాలమంతయు నిట్టులే • గడచెనయ్య
నిన్ను పూజింపవలెనన్న • నిశ్చయంబు
బుట్టగానియిప్పటికెంతో • ప్రొద్దులేదు. ౬౩

సీ॥ వేదముల్ నిన్నెందు • వెదకుచుండెడునంట
వేదాంతులెప్పుడు • వెదకుదురట
శ్రుతులిప్పటికిని న్ను • జూడనే లేదంట
శ్రుత్యంతములుగూడ • జూడవంట
జ్ఞానులునీరూపు • గాంచనెంచెదరంట
మునులకునీరూపె • ముఖ్యమంట
దాతలెవ్వరునిన్ను • దర్శింపలేదంట
భక్తిసల్పుటయు నీకా • బట్టుటకట,
తే॥ గీ॥ ఇంకనెందరో యీరీతి • నీశనిన్నుఁ
బరమభక్తిశ్రద్ధలతోడఁ • బట్టనుండఁ
రామచంద్రునిన్నుఁ జేర నే • పగిది నేర్తు॥ ౬౮

సీ॥ శ్రుత్యర్థములఁ దెల్పు • సుజ్ఞానిగనుగొన్న
బౌరాణికులనోటి • పాటవిన్న
మతకర్తబోధించు • మాటలువినుచున్న
సాధులవిజ్ఞాన • సరణివిన్న
మానులనిశ్చల • మహిమంబుఁగాంచిన
దానశస్త్రులదాన • ధాటిఁగనిన
దేశాభిమానుల • దీక్షఁజూచుచునున్న
పరహితార్థులుపను • పాటుఁగనిన
తే॥ గీ॥ నిన్నె లక్ష్యమునందుంచి • నేర్పుమీర
సంచరించుచునున్నారు • సర్వసాక్షి!
అట్టినీరూపమునుజూడ • నెట్టులబ్బు? ౬౯

సీ॥ దిక్కులన్నిటి యందు ♦ దేశదేశములందు
నాకాశమందున ♦ నగ్నియందు
జలమందు భువియందు ♦ జలచరంబులయందు
సకలవృక్షములందు ♦ సరసులందుఁ
బంచభూతములందు ♦ ప్రాణికోటులయందు
సూర్యచంద్రులయందు ♦ చుక్కలందు
మూఁడుకాలములందు ♦ మూఁడుమార్గులయందు
మునులందు, సురలందు ♦ మనువులందు

తే॥ గీ॥ నిండియుండిన చిద్రూప ♦ నిర్మలాత్మ!
కర్మవశమున, గాబోలు ♦ కాపురుషులు
కంటిదగ్గఱనున్న నిన్ ♦ గాంచలేరు॥ ౬౭

సీ॥ నదనదీజలముల ♦ నడకలలోపల
కోయిల మధురంపుఁ ♦ గూఁతయందు
బూర్ణమై వికసించు ♦ పుష్పగుచ్ఛమునందు
లేమావిచిగురుల ♦ లేఁతయందు
నాహ్లాద మొసఁగించు ♦ నంచనడలయందు
నెమలి పించము విప్పు ♦ నీటునందు
పర్వతాగ్రములందు ♦ బయలు భూములయందు
జలనిధి ఘోషించు ♦ శబ్దమందు

తే॥ గీ॥ సాధులగువారి వాక్కుల ♦ శాంతమందు
మధురముగ బల్కు భక్తుల ♦ మాటలందు
నీ సురూపము. కనుపించు ♦ నిశ్చయముగ ౬౮

సీ॥ విప్రోత్తములు జేయు ♦ వేదగానమునందు
క్షత్రియులొనరించు ♦ సమరమందు
వైశ్యులు గావించు ♦ వర్తకాదులయందు
గష్టజీవుల జేయు ♦ కష్టమందు
పరమసాధ్వులొనర్చు ♦ భర్తృసేవలయందు
గాయకుల్ గావించు ♦ గానమందు
నటకులు గావించు ♦ నర్తనాదులయందు
భక్తులు పాడెడు ♦ పాటలందు

తే॥ గీ॥ నిన్ను లక్ష్యము నందున ♦ నిలుపకున్న
వారి కోర్కెలు సఫలమై ♦ వరలగలవె
దేవ దేవ! సర్వేశ్వర! ♦ దివ్యపురుష, ౬౮

సీ॥ కూడుగుడ్డకు రాని ♦ పాడుసంగతులకుఁ
బెరవారలకుఁ జెడ్డ ♦ పేర్లు పెట్ట
దారిబోయెడు వారిఁ ♦ దక్కించ నిలుపంగ
విబుధుల నెల్లర ♦ వెక్కిరింప
బరుల కార్యముఁ గాంచి ♦ పరిహాసమొనరింపఁ
దగదన్న వారితోఁ ♦ దగవులాడఁ
జెడదిట్టుకొను దారిఁ ♦ చీట్లపేకాడంగ
నీల్గుచుఁ బగలెల్ల ♦ నిద్రబోవ

తే॥ గీ॥ మనుజులకు గాలమెంతైన ♦ మహిని గలదు
జగములకు నీశ్వరుండైన ♦ చక్రపాణి
సేవకై కాలమే లేదు ♦ చెడుగులకును॥ ౬౯

సీ॥ అక్షరమెఱుఁగని • యజ్ఞానజనముల
ఘనకవిశ్రేష్ఠులుగా • మనిపినావు
జారచోరాదులౌ • క్రూరకిరాతుల
పరమభక్తులుగాఁగ • నెఱపినావు
కూఁడుగుడ్డకు లేని • కోటిదరిద్రుల
మహి నేలువారిగా • మార్చినావు
నీతి యేమెఱుఁగని • నీచమానవులను
ఘనయోగులనుఁ జేయ • గలిగినావు

తే॥గీ॥ ప్రకృతిఁ బుట్టింపఁ బోషింప • బాధఁ జేయ
జాలువాఁడవు నీకేది • వింతగాదు
భక్తవరులపాలిటికొంగు • పసిడిమూట॥ ౭౦

సీ॥ పర్వతంబులనుండి • పాఱుచుండినయట్టి
యతినిర్మలప్రవా • హములఁ గనిన,
యాప్రవాహములకు • నావలీవలనుండు
పలువిధంబగువృక్ష • పంక్తిఁ గనిన,
యాపంక్తికీపంక్తి • కల్లిబిల్లిగనల్లు
చలువలీనెడుతీఁగె • కలిమిఁ గన్న,
యాతీగలకుఁ బైన • నాహ్లాదమొనరించు
పూర్ణమై వికసించు • పూలఁ గనిన

తే॥గీ॥ యంతలోఁ బుట్టు • మదిలోన హాయిఁ గనిన
ఎవఁడు మనమున నినుస్మరి • యింపకుండు?
మూర్ధమును వంచి యెవ్వఁడు • మ్రొక్కకుండు! ౭౧

సీ. వినువీధి కెగురుచు • వేగంబుతోఁ బోవు
గంగానదీ తరం • గములఁ గనిన
యా తరంగములయం • దతికుతూహలముతో
నాటలాడుచునంచ • కోటిఁ గనిన
కోరుచుఁ గెరుచుఁ • గోర్కులూరఁగఁ బెంటి
ప్రియమారఁ బతిఁ జూచు • ప్రీతిఁ గనిన
యామరాళపుజంట • లన్యోన్యముగఁ గాఁగి
లించిముక్కులదువ్వు • లీలఁ గనినఁ

తే. గీ. ప్రకృతియంతయుఁ బ్రేమతోఁ • బట్టుబట్టి
పుట్టఁగాఁ జేసినట్టినీ • పూర్ణశక్తి
మహిమఁ గని నీకు మ్రొక్కని • మనుజుఁ డెవఁడు! 22

సీ. మామిడితోఁటలో • మనములూరుచునుండ
జిగురాకు లీనుగుంపు • చెట్లఁ గనిన
యా చెట్లకొమ్మల • నంటి వ్రేలాడు
పక్వంబులగుమంచి • పండ్లఁ గనిన
యా పండ్లముక్కుతో • నదిమిపట్టఁగఁ బోవు
తమిచిల్కరెక్కతటి • తటలుగనిన
యాతటతటలకు • నదరి పిచ్చుకలెల్ల
జేరుచుండెడు లేఁత • చెట్లఁ గనిన

తే. గీ. చెట్లకై మోటదోలెడు • చిన్నవాఁడు
మోకుపై నెక్కయుత్నించు • మోజుఁ గనిన
నంతయును తావకానంద • మనఁ డెవండు! 23

సీ॥ గుండెగుభేలన • కోటిశబ్దములతో
ఘోషిల్లుసంద్రంపు • ఘోషఁజూచి
పర్వతంబులమించి పైకిలేచుచునుండు
నతిభయంకరమగు • నలలఁగాంచి
కనుచూపుకును మించి • కనుపించుచున్నట్టి
మితిలేని యావారి • మితినిఁజూచి
మేఘంబులఁ బోలి • లాఘవంబుగ నీదు
బల్గొప్ప జలచర • పటలిఁజూచి

తే॥ గీ॥ పర్వతముపైననొకచీమ • ప్రాకుపగిది
పడెడులేచెడునొకనావ • పటముఁగాంచి
యౌర! నీసృష్టిశక్తియాశ్చర్య • మనఁడెవండు! ౨౮

సీ॥ పగలెల్లయెండలో • పలుఁగష్టపడిచేసి
మట్టినూకలవిన్ని • పట్టితెచ్చి
చెరువులోపల మున్గి • చెట్టుక్రిందనువండి
పిల్లలు తల్లియు • వల్లభుఁడును
నందరు భుజియించి • యాఁకలితో లేచి
కుండ, చట్టియుఁ జెట్టు • గూటఁబెట్టి
గుడిలోననోయేరి • కొంప ముంగిటిలోనొ
పడుకొని యేదియో • పాడుకొనుచుఁ

తే॥ గీ॥ బహులసౌఖ్యముఁ దమకిష్ట • పాటుఁదనము
దలఁపక సుఖించుచుందు రా • దంపతులను
జూడ నీసృష్టిసౌఖ్యము • జోద్యమనరె? ౨౯

సీ॥ ప్రళయంబుఁ గల్పించి • పాడుచేయుదవీవె
సృష్టియించని పుట్టఁ • జేతువీవె
మాయయంచని కన్ను • మాయజేయుదువీవె
నిజమని కనుపించు • నజుఁడవీవె
పండితుల్ వచియించు • పరతత్వ మదినీవె
యజ్ఞానులెఱుఁగని • యదియునీవె
పాపపుణ్యమునీవె • ఫలముగష్టమునీవె
జీవుఁడవనువాని • జీవమీవె

తే॥ గీ॥ పిచ్చివాడవు పరులను • పిచ్చినట్లు
జేయువాఁడవు సివంచు • జెప్పజ్ఞాని
గుట్టితత్వంబు మాబోంట్లు • కెట్లు తెలుక! 26

సీ॥ కుల్లుపదార్థముల్ • కోరివచ్చిన యీగఁ
బట్టి మింగుచునుండు • పాడుకప్ప
కప్పబైటకు రాగఁ • గని పెట్టిదిగమ్రింగు
నేటిలోఁదిరుగాడు • నీటిపాము
పాముబైటకు రాగఁ • బట్టి చీల్చును పైన
సంచరించుచునున్న • సాంప్రదేగ
యాడేగలంబట్ట • నడవి జాతులవార
లిచ్చుటుండేండ్లలో • వచ్చుచుంద్రు

తే॥ గీ॥ పట్టిపిడుగేదొ వాండ్రపై • నష్టపడును
జీవమే జీవమును హింస • జేయుచుండు
నిందలిరహస్యమజ్ఞాని • యెఱుగు టెట్లు?॥ 27

సీ॥ లెక్కపెట్టగలేని ♦ చుక్కగుంపులవన్ని
యెట్టిగోళములై యుం ♦ చెరిగినపుడు
చంద్రమండలమందు ♦ జనులుండినట్లుగాఁ
గనుపించు జాడలు ♦ గనినయప్పు
డుల్కలంచన భూమి ♦ లూడిపోవుటయని
శాస్త్రంబులందున ♦ జదివినపుడు
భూగర్భమందున ♦ బాగిలేని ప్రళయంపు
టగ్నిహోత్రంబుండె ననినయపుడు

తే॥ గీ॥ ఈశ్వరా! నీదుసృష్టిలో ♦ నేనవంగ
నెంత? కష్టము, సుఖమది ♦ యెంతయనుచు
గుండె దడదడ, యెవరికి ♦ గొట్టుకొనదు ౭౫

సీ॥ భూకంపమది వచ్చె ♦ పోయెబట్టణమంచు
విపరీతవార్తలు ♦ వినినవేళ
జలధిలోపలనావ ♦ కులతోడఁబోగ యోడ
మునిఁగెనంచనువార్త ♦ గనినవేళ
నదివర్షములఁబొంగి ♦ నదీయూరిలోఁబడి
జంపె వారులనంచుఁ ♦ జదువువేళ
మాస్టర్లమత్తుచే ♦ మరబండ్లుడీకొని
పడిపోయెనని చెవిఁ ♦ బడినవేళ

తే॥ గీ॥ జంపుటలు బ్రతికించుట ♦ సమముగాను
నీకు క్రీడలటంచని ♦ నిర్ణయించు
తత్త్వవేత్తల నుడి యేరు ♦ తథ్యమనరు?॥ ౭౬

సీ॥ పున్నమనడిరాత్రి ♦ పూర్ణచంద్రుని కాంతి
కమలంబు కొలనులో ♦ గాంచు కాంతి
ఉరువర్షమున రాత్రి ♦ మెఱుపులోపలి కాంతి
వినువీథిఁ గలయింద్ర ♦ ధనుసు కాంతి
బ్రొద్దుదిర్గుడుబువ్వ ♦ పుష్పులో నెఱ్ఱను కాంతి
రాత్రివేళల వెల్గు ♦ ఒత్తి కాంతి
దల్లి కౌఁగిట జేరు ♦ తనయుని ముఖకాంతి
ధర్మతత్పరుఁడైన ♦ దాత కాంతి
తే॥ గీ॥ గాంచ నీకాంతి యింకెంత ♦ గలదో యంచు
నిన్నిటికిఁ గూడ నీకాంతి ♦ హెచ్చటంచు
మనసులో నీకు మ్రొక్కని ♦ మనుజుఁడెవఁడు? ౮౦

సీ॥ నదులెల్ల కడలికై ♦ నడచి పోవుటఁ జూచి
తీగలు పెనఁబడి ♦ తీరు జూచి
పృథివి యాకాశంబు ♦ పొందు సేయుచు జూచి
చిప్పలో బడు స్వాతి ♦ చినుకు జూచి
చెట్లు రెండొకటిగా ♦ జేరయుండుట జూచి
కొండ మేఘుని ముద్దుఁ ♦ గొనుట జూచి
దంపతుల్ ప్రేమించు ♦ ధర్మబంధముఁ జూచి
జంతుజాలము మ్రోల ♦ జతలు చూచి
తే॥ గీ॥ మోహమే సుమ్ము సృష్టికి ♦ మూలమనుచు
మోహమున కెల్లనివె సూ! ♦ మూలమనుచు
మోహనాకార! యని నీకు ♦ మ్రొక్కడెవఁడు? ౮౧

సీ॥ మత్తేభశిరములో • మంచిముత్యము లెల్ల
గప్పి పెట్టితి వేమి • గదలకుండ?
అమృతమంతయు జేర్చి • నాచంద్రబింబము
నందుంచినావేమి • చిందకుండ?
మనుజులుబోరాని • మకరాలయంబులో
మాటినావది యేమి • మణులనెల్ల?
బ్రహ్మరాక్షసులైన • పరమలుబ్ధులయొద్ద
దాచినావది యేమి • ద్రవ్యమంత?
తే॥ గీ॥ అందు కేగాని మందింత • యయ్యో లేమి
దాతలగువారి చేతిలో • ద్రవ్యమేది?
చెందకుమి కోప మిదియెన • చిన్నతప్పు. ౮

సీ॥ గందపుమ్రానును • గాగలించునదేల
తలను విషంబున్న • త్రాచుబాము?
తేనెతెట్టియలకు దెంపియే లేకుండ
గుట్టునీగల నేల • కొల్పితేల?
దబ్బపండుల చెట్లు • దరికి జేరకయుండ
పెట్టినావది యేమి • పెద్దముండ్లు?
అతిమనోహరమగు • నాగులాబీలెల్ల
కంటకావృతముగా • నుంటయేల?
తే॥ గీ॥ మంచివస్తువులకునంత • మాత్రమైన
గాపు లేకున్న జెడునంచు • గౌరవంబు
బోధ జేయగ జేసిన • బుద్ధి యేమొ! ౮౩

సీ॥ జలములనేగాక ♦ జలదంబులోపల
బిడుగులనేటికి ♦ బెట్టినావొ?
జలచరంబులెగాక ♦ జలరాశిలోనేలఁ
బ్రళయాగ్నినటుభద్ర ♦ పఱచినావు?
కొండలోనోషధి ♦ కోటులనేగాక
యగ్నిని సందేల ♦ యడిమినావు?
చల్లదనమెగాక ♦ చంద్రమండలమందు
విరహాగ్ని నెందుకు ♦ వేసినావు?
తే॥ గీ॥ ఘోర! చిత్రము! నీసృష్టి ♦ యరసిచూడ
నగ్ని యేపుట్టుకకుమారా ♦ మానుచునోచు
నందుకే విప్రులకుభక్తి ♦ యగ్నియందు॥ ౮౪

సీ॥ క్షణభంగురమటంచు ♦ జగమంతయునుకూడ
చెదలుపుట్టలటంచు ♦ జీవులెల్ల
నెండమావులటంచు ♦ నిండుసౌఖ్యములెల్ల
బాటసారులటంచు ♦ భార్యసుతులు
చుట్టములెల్లఁజెప్పు ♦ చోరులేయగునంచు
బంగారమదివిష ♦ ప్రాయమనుచు
సకలసంపదలును ♦ వికలమౌ కలలంచు
బావిమెట్టునసద్ర ♦ బ్రతుకటంచు
తే॥ గీ॥ నిన్ను సేవించుజీవమే ♦ నిత్యమనుచు
నన్నిటికి గూడనిభక్తి ♦ యధికమనుచు
జేతులెత్తిమొక్కెదనీకు ♦ చిత్స్వరూప॥ ౮౫

సీ॥ భక్తితోఁ బుతనిన్ను ♦ ప్రార్థించునటువంటి
మానవుఁడేసుమ్ము ♦ మానవుండు
పరమవేదాంతంబు ♦ పఠియించునటువంటి
పండితుఁడేసుమ్ము ♦ పండితుండు
నీసృష్టిచిత్రంపు ♦ నేర్పుచూచెడునట్టి
యాత్రికుఁడేసుమ్ము ♦ యాత్రికుండు
నిన్నులక్ష్యములోన ♦ నెలకొల్పితిరిగెడు
నాయకుఁడేసుమ్ము ♦ నాయకుండు

తే॥ గీ॥ అట్టివారికి గావించు ♦ నట్టిసేవ
నీకుగావించునట్టులే ♦ నిశ్చయముగ
గరములనుమోడ్చు వారికే ♦ గానఁజేవ!! ౧౬

సీ॥ పడమటఁగనుపించు ♦ బాలచంద్రునివందుఁ
బకపకనవ్వెడు ♦ బాలునందు
విద్వాంసుచేనున్న ♦ వీణామృతమునందుఁ
గమ్మనౌపయ్యెర ♦ గాలియందుఁ
జిగురుటాకులు మెక్కు ♦ చిక్కనుక్కులయందు
దుముకుచుండెడుకోనె ♦ దూడలందుఁ
బరమశాంతముతోడ ♦ భాషించుస్త్రీలందు
నడుగ లేదనలేని ♦ హస్తమందు

తే॥ గీ॥ నిలచియుండిన యటువంటి ♦ నిన్నుగాంచి
పట్టరానట్టి యానంద ♦ భరముచేత
మ్రొక్కకుండున జనుఁడెంత ♦ మూర్ఖుఁడైన॥ ౧౭

సీ॥ పల్కు-లేవో బల్కు- ♦ పసిబాలకునినోటఁ
బాటలఁ బాడెదు ♦ బాలునోట
గొనచెట్టు పైనుండి ♦ కూయుకోయిలనోటఁ
గలరవంబును జేయు ♦ పులుగునోటఁ
గారడవిలోఁ గేరు ♦ కాలకంఠమునోటఁ
బ్రియమార సతిబిల్చు ♦ ప్రియునినోటఁ
దమిమీర భాషించు ♦ తల్లిబిడ్డలనోట
నంబా యనుచు నుండు ♦ నావునోటఁ

తే॥ గీ॥ గనులఁజూడక జూచుచోఁ ♦ గానవెదవు
సుందరంబగునట్టి యా ♦ సదనమూర్తి
గాంచి మ్రొక్కదె యెటువంటి ♦ ఘనుఁడెయైన ౮౮

సీ॥ పరమవైరాగ్యంబుఁ ♦ బ్రబలఁ జేసినయట్టి
మునిముఖ్యుఁడగు "బుద్ధ" ♦ మునివి నీవె
పాపులరక్షింపఁ ♦ బ్రాణముల్ బాసిన
పరమపావనుడు "జేసు" ♦ ప్రభువు నీవె
సంఘంబు రాజ్యంబు ♦ సకలముగాఁ జూచిన
గురువు "మహమ్మదు" మహా ♦ ఘనుఁడ నీవె
సర్వంబు నొకటను ♦ సమబుద్ధి దెల్పిన
"శంకర" యతీశ ♦ స్వామి నీవె

తే॥ గీ॥ మానవులెఱుంగలేక యా ♦ భావములను
మతవిమతములని కొట్టుకొఁ ♦ జొప్పడయ్యె
అంతకన్నను నజ్ఞాన ♦ మునఁగఁగలదె॥ ౮౯

సీ॥ చదువేలమోక్షంబు ♦ సాధింపఁదలఁచిన
నాశయొక్కటి సంత్య ♦ మైనఁజాలు
నీసన్నిధికిఁ జేర ♦ నిఖిలతీర్థము లేల
యన్మృతంబువచింపఁ ♦ ననినఁజాలు
స్వర్గంబుసాధింప ♦ సకలయజ్ఞము లేల
సురులకుఁజెయిజాచ ♦ కున్నఁజాలు
పుట్టుకసశియింపఁ ♦ బుడమిదానము లేల
పాపపుణ్యము లేని ♦ బ్రతుకుజాలు

తే॥ గీ॥ నద్ది, యిదియంచును బ్రయాస ♦ మంద నేల
నిన్ను మనమున నే వేళ ♦ నిలిపియున్నఁ
గోర్కెలెంపుపంటిదైనఁజే ♦ కొనఁగ రాదె॥ ౯౦

సీ॥ భుజగేంద్రశయన! యో ♦ పురుషోత్తమా! హరీ!
సకలమానవదేవ ♦ చక్రవర్తి
శతమఖసేవితా! ♦ సర్వజీవాత్మకా!
నాళీకనయన! యా ♦ నాదిపురుష!
మానీంద్రవర్యస ♦ న్యాసితపదయుగ్మ
జ్ఞానులుధ్యానించు ♦ జ్ఞానమూర్తి!
మానవాతీత వా ♦ క్మానసాగోచరా!
పరమదయానిధే! ♦ భక్తవరద!

తే॥ గీ॥ అప్రమేయ! లోకేశ్వర! ♦ యాత్మరత!
నీకువందనశతములు ♦ నిఖిలవంద్య
పాపములబాపిరక్షింపు ♦ పరమపురుష! ౯౧

సీ॥ విజ్ఞులు పూజింప • విధము నే నెఱుఁగను
భక్తులనిశ్చల • భక్తి యెఱుఁగ
విప్రులు ప్రార్థించు • వేదమంత్ర మెఱుఁగఁ
దార్కికుల్ నిర్ణయించు • తర్కమెఱుఁగ
సాంఖ్యులుఁ జెప్పెడు • సాంఖ్యార్థ మెఱుఁగను
యోగులు ధ్యానించు • యోగ మెఱుఁగ
కర్మఠుల్ గావించు • కర్మంబు లెఱుఁగను
సాధువుల్ ధ్యానించు • సరణి యెఱుఁగ

తే॥ గీ॥ పరమమూఢుఁడ నీకిదే • పదులు పలుకు
సరవిఁ జేసెద నే నమ • స్కారములను
జేన! చేఁబట్టి రక్షింపు • దివ్యపురుష!! ౯౨

సీ॥ భక్తి యొకింత నిన్నుఁ • బ్రార్థించుటకుగాని
వేదాంతవాక్యముల్ • వినఁగఁగాని
ఉపవాసనియమంబు • లుండ నోచినగాని
హరికథల్ వినునట్టి • యాసగాని
తీర్థయాత్రలకునై • తిరిగివచ్చుటగాని
చేజాచ నేమైన • జెప్పఁగాని
యాపోశనంబింత • యతిథికీయఁగగాని
నినుఁగూర్చి యేమైన • నేర్వఁగాని

తే॥ గీ॥ పరమదారిద్ర్యసంసార • బాధవలన
వీలుగనుపింపదినుమంత • వేదవేద్య!
ఎట్టులైనను జేపట్టి • యేలుమయ్య!! ౯౩

సీ॥ వేలుగాఁగార్యముల్ ♦ వెలగఁబెట్టినగాని
పొట్టయేవాఁటికి ♦ బూడఁబోదు
తగవులుసేస్తేలు ♦ ధర్మహానియెగాక
నిలుపడబుద్ధికిఁ ♦ గలుగఁబోదు
ధర్మమధర్మంబు ♦ దలఁచువారలు లేరు
గాఢైఁగజ్జమటంచు ♦ గనగ లేరు
కృష్ణ!కృష్ణా!యంచుఁ ♦ గూర్చుండఁజరుగదు
యంతటివైరాగ్య ♦ మసలె లేదు.

తే॥గీ॥ ఇంతయోయంతయోగమ్ము ♦ నెఱుఁగువానిఁ
జాలిచాలనివృత్తిచేఁ ♦ జంపఁబోకు
మన్నిటికిఁగూడదారిద్ర్య ♦ మన్నగాదె? ౯౪

సీ॥ రాజ్యాధిపత్యముల్ ♦ రప్పింపవద్దయా
యింద్రభోగములుమా ♦ కీయవద్దు
బ్రహ్మలోకమునకుఁ ♦ బంపింపగావద్దు
వసువులలోఁజేర్ప ♦ వద్దువద్దు!!
మూడులోకములలో ♦ ముఖ్యుజేయగఁవద్దు
బృందారకత్వమి ♦ ప్పింపవద్దు
వేలుసంపాదింప ♦ పిలుఁజేయగవద్దు
ఘనుఁడీతడనిజనుల్ ♦ గాంచవద్దు

తే॥గీ॥ పరులపైనాసపడకుండఁ ♦ బ్రతుకునట్లు
నీపదంబులపైభక్తి ♦ నిలుచునట్లు
చాలు దయసేయుమా వేయి ♦ జన్మములకు॥ ౯౫

సీ॥ పాపంబుకొండల • వలెనన్నియుండఁగా
స్వర్గవాసమునకై • చనఁగఁగలమె?
గతజన్మములధర్మ - కాంక్షలేకుండఁగా
నీనాఁడుసంపద • లెనయఁగలమె?
ఈపుట్టుకనువర్ధి • కీయలేకుండఁగా
ముందైనభాగ్యంబు • లందగలమొ?
అరివర్గములనైన • నాగలేకుండఁగా
సాయుజ్యసారూప్య • సరణియెట్లు?
తే॥గీ॥ కోరఁగాఁజాలనీలాటి • కోర్కెలెల్ల
నిన్నుసేవించినందుకు • నిర్మలాత్మ
చిత్తమునశాంతిఁగూర్చుమా! • శ్రీనివాస! ౯౬

సీ॥ పరులకై చేఁజాచి • పడలేము దెప్పిళ్లు
బందుగులనుచు లోఁ • బడఁగలేము
ధనవంతులిండ్లకుఁ • దఱచుగాఁబోవలే
మధికార్లపాదంబు • లదుమలేము
డబ్బుకైమూర్ఖుల • నుబ్బఁజేయఁగలేము
విభవంబునకుసిగ్గు • విడలేము
దర్పంబుతోడుత • దారిఁగొట్టగలేము
పరువింతపోయిన • బ్రతుకలేము

తే॥గీ॥ సర్వలోకంబులనుబ్రోచు • సరసుఁడవని
దాతవగునిన్ను వేఁడుట • ధర్మమ యని
చేయిఁజాచితిమేమైన • జేయుమయ్య॥ ౯౭

సీ॥ ప్రహ్లాదుభయమును ◆ బాపి యేలితివంచు
ధ్రువునిరక్షించిన ◆ దొరవటంచు
కరిరాజు నావాఁడు ◆ గాపాడినావంచు
పరసౌఖ్యమిడితివి ◆ పక్షికనుచు
శబరికి వైకుంఠ ◆ సౌఖ్యమిచ్చితివంచు
మునులకొసంగితి ◆ మోక్షమనుచు
నక్రూరు, ముచికుందు ◆ నరసి బ్రోసితివంచు
భక్తులనెల్లఁ గా - పాడితంచు

తే॥గీ॥ పరమ కారుణికోత్తమ! ◆ భక్తవరద!
మ్రొక్కుచున్నాఁడ నీకిదే - మోక్షరూప!
దర్శనంబింత యొసఁగవేఁ ◆ ధర్మమూర్తి!!॥ ౯౮

సీ॥ బలిచక్రవర్తిని ◆ ప్రార్థన జేసిన
యతికోమలంబగు ◆ హస్తయుగము
అమ్మా! యటంచును ◆ నలయశోదా దేవి
నాలింగనముఁ జేయు ◆ హస్తయుగము
సీత శ్రీ ప్రభుభీతి ◆ నిన్నెత్తుకొనిపోవ
నతనికంఠము బట్టు ◆ హస్తయుగము
కౌసల్యచిత్తంబు ◆ కరముల్లసిల్లగా
అదియిదంచునుఁ జూపుఁ ◆ హస్తయుగము

తే॥ గీ॥ అఖిలవేదోదములఁ బ్రోచు ◆ హస్తయుగము
అవ్యయంబుగనొప్పారు ◆ హస్తయుగము
సాచి యభయంబొసంగుమా! ◆ సర్వసాక్షి! ౯౯

సీ॥ మఱువఁజేయకు నిన్ను ♦ మహనీయగుణసాంద్ర!
మఱువకయ్యా మమ్ము! ♦ మహితచర్య
యేమరఁజేయకు ♦ మీశానుసేవితా!
యేమరెదవు యేమొ ♦ యింద్రమాన్య
తలఁపఁగాఁజేయుము ♦ ధర్మసంస్థాపనా
తలఁపకుండెదనుసుమీ ♦ ధర్మమూర్తి!
ప్రార్థింపఁజేయుమా ♦ పరమపావననామ!
ప్రార్థనల్ వినుసుమీ ♦ పరమశీల!
తే॥ గీ॥ యెల్లకాలము దేవ ని ♦ న్నెఱుగఁజేయు
నెల్లకాలము మమ్ము బ్రోవ ♦ నెఱుఁగుమయ్య
కన్నులకుఁ గానుపింపుమీ ♦ కన్నతండ్రి!
రమ్యగుణసాంద్ర శ్రీరఘు ♦ రామచంద్ర! ౧౦౦

సీ॥ నీదయఁ గల్గి నే ♦ నేర్చిచేసినయట్టి
శతసీసపద్యంపుఁ ♦ బతకమిదిగో!
ప్రతిభయేమాత్రము ♦ బయటకు రానట్టి
తీఁగెనరతనాల ♦ హారమిదిగో!
రంగారుమేలిమి ♦ బంగారులేమిచే
పంతుగానుండని ♦ దండయిదిగో!
పండితుల్ పరికింపఁ ♦ బ్రమదంబుఁ గల్పించు
మాణిక్యమేలేని ♦ మాలయిదిగో!
తే॥ గీ॥ పేదకవి యెల్ల నెఱవచ్చుఁ ♦ బ్రీతి దప్పఁ
బదములన్ని సీసములంచుఁ ♦ బద్మనాభ!
నిగ్రహింపక కరుణ ప ♦ రిగ్రహింపు!
రమ్యగుణసాంద్ర శ్రీరఘు ♦ రామచంద్ర!! ౧౦౧

సీ॥ మణిగణనికరస - న్మణిభూషణములెన్ని
కలవు మహాత్మ నీ ♦ కంఠమందు
ఉత్పలచంపకా ♦ ద్యరుణరత్నహారంబు
లున్నవి వేలు నీ ♦ యురమునందు
చిత్రగీతములతోఁ ♦ జెక్కినవజ్రంపు
బతకముల్ గలవు నీ ♦ వక్షమందు
మదనరేఖాబింబ ♦ మణిరంగ వైడూర్య
కాంతులుగలవు నీ ♦ గళమునందు
తే॥ గీ॥ అందమేమి లేకున్న యీ ♦ హారమేను
భక్తితోడను మిగులప్ర ♦ పత్తితోడ
నలుతగీలింతుదయతోడ ♦ నందికొనుము ౧౦౨
సీ॥ వాత్సల్యనిధిభర ♦ ద్వాజమహర్షిస
ద్గుణభూషితుడుమాదు ♦ గోత్రకర్త
విజ్ఞానవంతులౌ ♦ విప్రాన్వయములోని
యార్వేలశాఖ మా ♦ యన్వయంబు
పుణ్యైకమూర్తులౌ ♦ పున్నమబలరామ
ధన్యదంపతులుమా ♦ తల్లిదండ్రి
ఆంధ్రదేశంబున కాయపు పట్టైన
కుండినసీమమా ♦ మండలంబు
తే॥ గీ॥ మంత్రి భాస్కరువలనన ♦ న్మహితకీర్తి
గనినగుంటూరు చెంతమా ♦ కాపురంబు
శాంతవిస్ఫూర్తికాంతప్ర ♦ సన్నమూర్తి
రమ్యగుణసాంద్రశ్రీరఘు ♦ రామచంద్ర॥ ౧౦౩

*శ్రీరామచంద్రార్పణమస్తు.*

# శ్రీ సీతారామ వియోగము.

సీతా, రామ, లక్ష్మణులు పంచవటి ప్రవేశించినది మొదలు శూర్పణఖ ప్రవేశము, ఖరదూషణులవధ, మారీచుని మోసము, సీతాపహరణము, శబరీదర్శనము, వాలివధ మొదలగు నరణ్యకాండగాథయంతయు నైదంకములుగ వ్రాయబడిన నాటకము. నాటకములయందు పద్యములు పాటలు స్వాభావికములా? వచనము స్వాభావికమా? యను విషయమవతారికయందే గాక సూత్రధారముఖంబున బహుదూరము చర్చించి నిర్ధారణ చేయబడియున్నది. శతావధానులు శేషాద్రి రమణకవులచే నాటకోత్పత్తిగురించి గొప్పపీఠిక వ్రాయబడియున్నది. అనేక పండితకవుల సదభిప్రాయములుగలవు. విఖ్యాతపండిత కవులును, నానావిధగ్రంథకర్తలును, జమీందారులునగు మహారాజరాజశ్రీ శ్రీ గాజామంత్రి ప్రగడ భుజంగరావు బహద్దరు జమీందార్లవారు తమవిపులమగు సదభిప్రాయము చివర నీపద్యమును రచియించియున్నారు.

క॥ సీతారామవియోగము । సీతారామవియోగముచే నాస్యవిశా
సీతారామాంకుశుభా । సీతారామాంకు భముఁ బ్రసిద్ధింగాంచున్॥

(ఇంగ్లీషుగ్లేజు ౮౦ పేజీల గ్రంథము) [వెల: రు ౦-౧౨-౦]

# శ్రీ రామచంద్ర శతకము.

సాంఘిక రాజకీయవిషయములలో నూతనపద్ధతిని వ్రాయబడినది. ఇందు నిమ్నజాత్యుద్ధరణము, బ్రాహ్మణేతరోద్యమము, స్త్రీస్వాతంత్ర్యము, [illegible] మొదలగు విషయములపై వ్రాయబడిన పద్యములు మిగులసహేతుకములు పద్యములన్నియు మిగులహృద్యములు. వెల: రు ౦-౪-౦

# శ్రీ కృష్ణ నీతి శతకము.

విద్యార్థుల యుపయోగము నిమిత్తము మిగుల సులభశైలిలో వ్రాయబడినది. ఇందలినీతులు సర్వమతసమ్మతములు. నందిగామతాలూకా పాఠశాలల సబ్ అసిస్టాంటు ఇన్స్పెక్టరుగారగు మహారాజరాజశ్రీ వేపూరి లక్ష్మీనరసయ్య ఎం. ఎ. గారు చక్కనిపీఠిక వ్రాసియున్నారు. వెల: రు ౦-౨-౦

పోస్టేజి కొనువారే భరించవలయును.

కర్త:

యేటుకూరు సీతారామయ్య,

యేటుకూరు, గుంటూరు జిల్లా.

